ఆంధ్రకేసరి గ్రంథమాల. ౫.

# ప్రశాంతి






వృష శ్రావణం

జులై ౧౯౪౧.

ప్రకాశకుడు:-

గుండవరము హనుమంతరావు.

సుల్తాన్‌బజారు, హైదరాబాదు-ద.

వెల: ౪ అణాలు.





## మహారాజ పోషకులు:

శ్రీశ్రీశ్రీ రాజా రామదేవరావు బహద్దరుగారు

## రాజ పోషకులు:

శ్రీశ్రీశ్రీ రాజా బహద్దరు వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారు
,, ,, ,, దోమలపల్లి యాదగిరిరావుగారు
,, ,, ,, అక్కినేపల్లి జానకిరామారావుగారు

## పోషకులు:

శ్రీశ్రీశ్రీ రాణీ భాగ్యలక్ష్మమ్మగారు
,, ,, ,, మాడగిరి నారాయణరావుగారు

## అభిమానులు:

శ్రీ శ్రీ ఇల్లిందల రామచంద్రరావుగారు; ఎచ్. సి. ఎస్.
,, ,, కొంపల్లి నరహరిరావుగారు
,, ,, పుల్లమరాజు వెంకటేశ్వరరావుగారు
,, ,, మందుముల రంగనాథరావుగారు
,, ,, జీ. శ్రీనివాసరావుగారు
,, ,, అందుగుల లక్ష్మారావుగారు

## సహాయకులు:

శ్రీ చిక్కేపల్లి రామచంద్రరావుగారు
,, డి. వి. రామారావుగారు
,, ఆగీరు ఈశ్వరయ్యగారు
,, చరుకుపల్లి హరికృష్ణారావుగారు
,, ఎస్. నారాయణగారు

# మనవి

ఈ 'స్రవంతి' మా గ్రంథమాలయొక్క అయిదవ ప్రసూనం. కొంచం ఆలస్యమయినా సంవత్సరానికి అనుకున్న పుస్తకాలు ప్రచురించినాము. వచ్చేసంవత్సరానికి గ్రంథమాల నియమాలు మారినావి. సంపాదకవర్గంలోకూడా మార్పు కలిగింది. 'ఆంధ్ర కేసరి' మాసపత్రిక, 'ఆంధ్ర కేసరి' గ్రంథమాల రెండూ నిర్వహించటం, ప్రస్తుతపరిస్థితుల్లో యించుక కష్టంగా నున్నది. కాబట్టి యికముందు, ముందే వార్షికమూల్యము గైకొని 'యిన్నిపుస్తకాలు వేస్తాము' అని చెప్పదలచుకోలేదు. యథాశక్తి మేమే పుస్తకాలు, మా యనుకూలం ప్రకారం, ప్రచురించి, యేపుస్తకం వెల ఆ పుస్తకంకొరకే యేర్పరుస్తాము. కాబట్టి మా చందాదారులు నిరుత్సాహపడ నవసరం లేదు. వారు మా ప్రతిపుస్తకాన్ని మునుపటివలెనే ఆదరించి స్వీకరిస్తారని నమ్ముతున్నాము.

కాగితము కరువులోగూడా ఈపద్యాలపుస్తకం యిట్లా రావడానికి మాగ్రంథమాల జయప్రదంగా నడవడానికి తోడ్పడిన మహాశయులందరికీ మా మనః పూర్వకమైన గౌరవాభివందనములు. వారి ఆదరాభిమానములకు పాత్రులమగుటకు యిక ముందుకూడ ప్రయత్నిస్తామని గట్టిగా చెప్పగలము.

ఇట్లు,

ప్రకాశకులు.

# ఆంధ్రుడా?

స్వాగత మాంధ్ర సోదర!
విశాలప్రపంచము నొక్కసారియు
ద్వేగ మనస్కుఁడౌచు కనువిప్పి
కనుంగొనుమయ్య! నల్గడల్
మూగినవప్పుడే ప్రళయముఁ
దలపించెడి కారుమబ్బు; లీ
భోగపరాయణత్వమిక పొందదు
మేల్కొను మాంధ్రసోదరా!

ఎంతటి స్తోత్ర పాఠముల
నెవ్వరొనర్చిన గాని నీకు నా
వంతయు శక్తి రాదు; యిటు
లాత్మ విహీనుడవైతివేమి? ఆ
శాంతములందు దిగ్విజయ
స్థంభము లెత్తుగ నాటినట్టి యా
కాంతకు కడ్పుచెడ
గల్గితె? యాంధ్రుడ లెమ్ము లెమ్మికఁ.

# ఆంధ్రుడా?

స్వాగత మాంధ్ర సోదర!
విశాలప్రపంచము నొక్కసారియు
ద్వేగ మనస్కుఁడౌచు కనువిప్పి
కనుంగొనుమయ్యా! నల్గడల్
మూగినవప్పుడే ప్రళయముఁ
దలపించెడి కారుమబ్బు; లీ
భోగపరాయణత్వమిక పొందదు
మేల్కొను మాంధ్రసోదరా!

ఎంతటి స్తోత్ర పాఠముల
నెవ్వరొనర్చిన గాని నీకు నా
వంతయు శక్తి రాదు; యిటు
లాత్మ విహీనుడవైతివేమి? ఆ
శాంతములందు దిగ్విజయ
స్థంభము ఎత్తుగ నాటినట్టి యా
కాంతకు కడ్పుచెడ
గల్గితె? యాంధ్రుడ లెమ్ములెమ్మికన్.

చూడుము, నీదు తల్లియె
యశోకవనంబున సీతమాడ్కి యు
ల్లాడెడు నన్యరాష్ట్రముల
లావు దొరంగి; తదీయముక్తికై
వేడఁగరాద దెవ్వరిని
వీరుని బోలె చరించి, నీవె యా
చేడియ బన్నముల్వొడఁగ
జేసి తరింపుము ఆంధ్రసోదరా!

కాలమహాబ్ధి వీచికల
గాసిలి కోర్వఁగ లేక ఉగ్రవా
తూలహతిన్ భ్రమించి
పలుత్రోవల ద్రొక్కెను నావయాంధ్రి. ఎ
ట్లో లవమాత్రప్రాణముల
నొడ్డుకు జేరిరి నీదుసోదరుల్!
యేలర ఆంధ్ర! వారిగని
యిట్లు మనంబున చీదరించెదో?

అంతరించెను నీదు యనుగు పుత్రుల ఖ్యాతి
హారతికర్పూర మట్లుగాగ;
కాలవాహినిలోన గలసి పోయెను నీదు
పూర్వవైభవ యుక్త భూరి కీర్తి;
మఱకార్చు బండు నీ భూమిసారములెల్ల
కలలోని వార్తలై నిలిచిపోయె;
ఏ గుంటలో నీర మాగుంట నింకిన
సామెతగా నీదు శౌర్యమింకె;

నీదు పుత్రులు నీయందు నెనరుదప్పి
మైమరచి నీదు పాలనమానినారు!
తల్లిరో నీకు యిందరు తనయులుండి
గర్భదుఃఖంబు తప్పదు గాదెయకట!!

బి. విశ్వనాథం.



# విజయ గానము.

ఆంధ్రమాతకు విజయమగునని
యాంధ్ర దేశము కీర్తిగనునని
యాంధ్రవీరులు శక్తియుతులని
యాంధ్రపుత్రుల చెవులకింపుగ
న్నాలపింపుమి మధురగానము
నాలపింపుమి కోకిలా!

కనులు తెరువని కాలమందున
గాసినందుచు కొంతకాలము
కలిసియుంటివి కాకిమూకల
కర్కశత్వ నినాదముల్ విని
కల నిజమ్మను గాంచి త్వరపడి
కడకుదొలగి తనంతకీర్తిని
గడనసేసితి ముదమునందితి
కరుణచరితము నాంధ్రవీరుల
కర్ణరంధ్రము లందు సోకగ
నాలపింపుమి మధురగానము
నాలపిరిపుమి కోకిలా!

అణగియుండిన ఆంధ్ర తేజము
ఆరిపోవగ లేదటంచని
అద నెరింగిన పూర్వరీతిని
యఖిలమగు తన నైజరూపము
నాంధ్రసుతులకు చూపగలదని

యాలపింపుమి మధురగానము
నాలపింపుమి సోదరా!

వేడిఎండల కాగ జాలక
వాడియుండిన ఆంధ్రవృక్షము
నేడు కురిసెడి వర్ష వితతికి
బోడితనమది వీడి పోవగ
వేడుకలర చిగిర్చెనంచని
ఆంధ్రపుత్రుల యాత్మలలరగ

నాలపింపుమి విజయగానము
నాలపింపుమి మధురరవమున
నాలపింపుమి సోదరా!

ఏటూరి సత్యనారాయణరావు.

# రాణాప్రతాప సింహుడు.

దాసోహమ్మని వైరికింకరుడవై
దాస్యంబు గావించుటల్
వాసిన్ ధైర్యము మొక్కవోని యశశ్శో
భా దీప్తి మాయించి స్వా
త్రాసిన్ మూలకుబెట్టుటంచెరిగి యా
త్మార్పణ్యాతన్ దేశసే
వా సంసిద్ధిత గానకేగగ ప్రతా
పా! నీకె చెల్లున్ సుమీ!

ఎండ కన్నెరుగని యిల్లాలు రానేల
చండ భానుప్రభా కాండమరయ?
తూగు టుయ్యెలలోన నూగులాడెడి సుతుల్
బండ రానేలపై బవ్వళింప?
షడ్రసోపేత భోజనము సల్పెడి నీవు
కందమూలముల నా కలినిదీర్ప?
పరిచర్యలొనరించు పరిచారకులులేక
సాధ్వి నీ భార్యయే సకలమరయ?
తోడి రాజన్యులెల్లరు వీడి నిన్ను
అక్బరున్ జేరి సుఖముల నందుచుండ

అతడు తనదాస్యమ్ముఁ గొను మనుచునుండ
ధీర వీర ప్రతాప! నీవేర స్వంత
రాజ్యముఁ జేయఁబూని, నిరాకరించి
కడకుద్రోసితి వాతని కాంక్షలన్ని!

సుతులు యాకలిగొని యేడ్వఁజూచి తల్లి,
'వంటకము లాచరించి వేవత్తు'ననుచు
బిడ్డలఁ మీఁకడఁ జేర్చి ప్రేమమీర
వంటశాలలో చేరిన పసి నిసుగులు
'అన్న మన్న' మటంచును యార్తి దేల
యెంత దురపిల్లితో రాజ! హీనస్థితికి!

అట్టి సమమాన మొగలులు యరుగుదెంచు
చున్న సడి విని రాణినిజూచి 'వంట
వీడి పయనమ్ము గమ్మ'ని వేడుకొనుట
నీకె యెంత దుస్సహమయి నెగడినదియొ?

ఇట్టులొకనాఁడె యేమ మార్లేదు చోట్ల
వంట మొదలిడి వెంటనే పరుగులిడుచు
వెడలిపోవంగ బాలుఁడు వెక్కి వెక్కి
అలమటించుచు నాకలి కాగలేక
సొమ్మ సిలిపోవుచుండుట జూచి యెంత
పరితపించితివో నీవు నరవరేణ్యా!

ఏనమిదవచోట పోయిబెట్టి యెంతో శ్రమచె
రొట్టె నొకదానిజేసితే!! రోదనంబు
మాని బాలుడు తినుచుండ శ్వానమొకటి
దాని నెత్తుకుపోయిన తరుణమందు
పిల్లవాడేడ్వ మొదలిడ పెద్దవైన
నీకు సహితము కన్నీరు నెగడెనేమొ?

...... ...... ......

ఇన్ని యిడుముల బడియును యెన్నడేని
ధైర్యమును సుంతవీడక దైవగతికి
చింతనందక తుదకు నీ పంతములను
ధన్య మొనరించినావు ప్రతాపసింహా!

బోయినేపల్లి రంగారావు.



# సంధ్య.

కమల! యేటికి కోపము కాంతుపైన
బూనెదవు? ఆతడేతప్పు బూనిక్కతోడ
జేసెనీయందు? ఇంతకే చెలిమిమాని
ముఖము ముకుళించెదవ నీవు మూర్ఖవగుచు ?

కాల మహిమంబునకు తాను గట్టువడుట
నీదు కోర్కెల నెరవేర్ప లేదశక్తి
నందుచేతనె ముఖమెల్ల నరుణకాంతి
'దీప్తి'చే వెలవెలబారె దీనుడగుట.

నీదు వికసితముఖమును నీ కపోల
రుచులు నీ యధరామృత రుచులువీడి
పోవ నామిత్రునకునెట్లు వలనుపడును?
మనసు నిలకడ బూనునా-మాటకైన ?

కర్మ బద్ధుండగుట చేత కాంతుడట్లు
నిన్ను విడనాడిపోయెను. నిక్కమరయ
వేరు తలపులు లేవు; నీవేల చాల
సంశయించెదు యూరకే సచివుసట్లు?

కాంతు వియోగ సంజనిత
గాఢ తమః పటలంబునందు నో
కాంతయ దేల మూర్ఛిలెదు?
గాసిలి జెందుచు చిన్నబోయె దో
క్కింత విళంబనంబు సహి
యింపక వచ్చును నిన్ను జూడ నీ
వంతలో కోపము విడచి
యాతనికిమ్ము సుస్వాగంబులన్.

గొబ్బూరు రామచంద్రరావు.



# దైవం?

గణ గణ మ్రోగే
గంటల చప్పుడు
విద్యా దేవుని
మేలు కొల్పునా?

విప్రులు పాడే
వేద పనసలు
రాతి బొమ్మలను
రంజిల జేస్తావా?

'భక్తులు' చేసే
భజనల మ్రోతకు
సరిగా వింటే
చెవుడు పుట్టదా?

ఆతని పేరుతో
అన్యో హత్యల క
సలతడుంటే
హడలి పోవడా?

మతపు పిచ్చితో
మానవ లోకం
మురుగెత్తించే
మొద్దా దైవం?

కనక దుర్గాప్రసాద్.

# భరత దేశము.

ఆంధ్ర దేశము భరతమాతకు
నొసట దిద్దిన తిలకమనుచును
భరత దేశపు పుణ్యభూమిని
భక్తిగొల్వుము సోదరా। ॥భ।

స్వర్ణ దేవళ తాజమహాలుచె
లోకమందున కీర్తిగాంచిన,
హిందు, ముస్లిం, క్రీస్తు, సిక్కులు
అన్నిమతముల కాటపట్టగు ॥భ॥

కవితకన్యక నాట్యమాడిన
గానకళలును మిన్నుముట్టిన
వాఙ్మయంబున వాసికెక్కిన,
గంగయమునా సింధునదులచె
ప్రజలసాకెడి కామధేనువు
కోహినూరుకు పుట్టినిల్లగు ॥భ॥

రాజరుద్ర ప్రతాపసింహుల
శ్రీయశోక శివాజీధీరుల
ఖాన్ ఆజాద్ వీరవరులను
మదనమోహన గాంధినెహ్రూ
దాసు బోసుల గన్నతల్లగు
భరత దేశపు పుణ్యభూమిని
భక్తిగొల్వుము సోదరా!

గొబ్బూరు గోపాలరావు.

# ఆహ్వానము.

కనులు మూసిన యంతనే కలలో నీదు
తరుణమోహనముగ్ధ సౌందర్యప్రతిమ
మానస విలోచనంబుకు గానబడును;
మంజుభాషలు లలితకోమల మృదూక్తి
చెవుల ధ్వనియించి హృదయంబు జిల్చివైచు
సారభాంచిత పుష్పసంచయ మనోహ
రంబు నీ సఖ్యమతివ స్వప్నంబునందు
నైన నీచెల్మి కమ్మ పూదేనెసోన.

మెల్లమెల్లగ మాయమౌ మేఘమట్లు
నీలివలి పంపుటొల్లియ వాలుజడను
అతను ధనువను తనువుతో నవతరించి
బాధ గలిగించినావు నాప్రాణ సకియ!

పరిచయమైన దాది పలు
బాముల నోర్చుట దూరదూరముల్
దిరుగుట తప్పులొప్పులను
దెప్పుట కోపము చేతనెప్పుడున్
చురచురలాడెకాని మన
సుల్ తమితీరగ ప్రేమమాధురీ
ఝురులను గ్రోలెనే యొక వ
సంతమునైన సుఖిస్త్రి మేచెలీ?

తరుణమున్నప్పు డవకాశ మరయవలయు
సహజమగు కాంక్షలన్నియు జారెనేని
పిదప జింతింపగలుగు నిర్వేదఫలము
కానసూచించువాడ మార్గమ్ము వినుము!

అనుమానించెదవేల? యెల్లరకు ము
ఖ్యంబైన లీలా విలా
సన గార్గంబున నీవు నేను సఖి యి
ష్టా గోష్టిగా నైక్యమై
వనముల్ పర్వత స్వచ్ఛ తోయముల సౌ
భాగ్యంబు నెచ్చోటను నుం
డునో యచ్చోటికి రమ్ము పోవుదము రెం
డో మూడు మాసంబులున్.

ఆ సుఖ కాలమందు దిస
మంతయు కోరికలీన హృద్య కా
వ్యాసవ పానముఁ మధుర
వాద్య సమన్విత దివ్యనాట్య వి
న్యాసము నవ్యరాగ మృదు
లార్ద్రి మనోహర గానముఁ కళో
పాసనలందు బ్రహ్మ పర
మైన సుఖంబటు లైహికంబుగఁ.

రేయి బవలును ప్రతిరోజు ప్రేమజలధి
నోలలాడుచు నన్యోన్య లాలనంబె
ప్రణయ కోపాల దీర్పగ; పరిమదమెల్ల
'మాది'యని చాటిచెప్పెడి మాడ్కిమనము
ఒకరి కౌగిళ్ల నొకరము యొదిగి యొదిగి
అధర మధుస్వాదనంబె యాహారమనగ
హర్ష బాష్పోదకమె దప్పినారజేయ
మరచి యుందమురమ్మ యీ వసుధ చెలియ.

ఇంతటి సౌఖ్య జీవనము
కింతియె కాలము? స్వల్పమంచు నో
యింతిరొ నవ్వబోకు పరు
లెవ్వరి యల్లరి సోకరాని యే
కాంతము సుప్రశాంతియు న
కల్మషమౌ హృదయానురాగ గీ
తాంతర మాధురీ మహిమ
తక్కువమైనను గోలుపోదుమే?

బూర్గుల రంగనాథరావు.



# సంతాపము.

ప్రాయము బాల్యమింక నెడ
బాయగలేదు; నితాంత సచ్ఛుభో
పాయములైన విద్యల ను
పార్జన సేయగలేదు; తావక
శ్రేయము గోరు మాత కెద
జేకుఱలేదు ప్రశాంతి; యప్పుడే
యీ యప మృత్యువాతబడి
యేగితివా? దివి వేంకటేశ్వరా!

అతుల ప్రాభవ చాతురీ విభవధీ
వ్యాపార పారీణతాం
చిత దీర్ఘాయువువై యఖండ యశముం
జేకొందు వీవంచు నెం
చితి మెన్నండయినం గటా! హతవిధీ
చింతింప లేదింతలో
శత వర్షంబులు నిండు నీకనుచు మా
స్వప్నంబునం బాలకా!

పిడుగువంటి యీవార్త విన్పడిన; నుంత
చనువుగలమాకె యెంతో విషాదమయ్యె
అకట! కడుపారగన్న నీ యనుగుతల్లి
శోక మెటులుండునో చూడుమా కుమార!

కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండె "నా
కొడుకా" యటంచు నీ కూర్మితల్లి;
నిస్పృహా వశమున నిశ్చేష్టుడై మహా
వ్యథచేగృశించె నీ యనుగు తండ్రి;
"తమ్ముడా! నిన్నిక దర్శించుటెట్టులం"
చని శోకమొందె నీ యనుజచయము;
చిఱుత తనంపు నీ చేష్టలెల్ల దలంచి
యలమటించెడు త్వదీయాప్త వితతి.

ఇందఱెట్టుల నీ కొఱకేడ్చుచుండ
సుఖ మనుభవింప బోయితే సురపురంబు,
మా పురాకృత పాపస్వ రూపమిట్లు
ఫలితమయ్యె నటంచేము దలతుమయ్య.

కూపమునందు నీ వటుల
గూలి దరిన్గనలేక మున్గుచుం
తాపము జెంది దైన్యమున
దల్లడమందుచు "నయ్యొ అక్క! యో
బాపు! యికేను బోదున"ని
పల్కితి వంచని వింటి; ముద్దుకు
ఱ్ఱా! పవిబోలు మానసము
నైన పగుల్పగ జేయకుండునే?

నీరుచిర వర్ణనంబును నీ స్వతంత్ర
భావ విలసిత చతుర సంభాషణములు
కుటిల మెఱుగని నీ కల్ము గోలుతనము
మఱతుమే? మేమికెన్ని జన్మములకైన.

వెలమల రామగోపాలరావు.



# భారతీ!

హాటక గర్భురాణి! నిఖి
  లాంధ్ర విశుద్ధ కవిత్వ సంపదన్
వాటముగాను మా కొసగి
  భావములన్ బ్రకటింపజేయు మా
మాటలమేటి మా హృదిని
  బ్రస్తుతిజేయు సుశక్తినిచ్చి మో
మోటములేక కావ్యముల
  ముచ్చటగా వెలయింప జేయుమా!

తెలుగు కవిత్వ సంపదను
  తియ్యదనంబును నెల్ల దిక్కులన్
సులువుగ వ్యాప్త మానటుల,
  'చోద్యము విశ్వములోని భాషలన్
తెలుగె రసార్ద్ర భావముల
  తేనెల పుట్ట' యటంచు గొప్పగా
బలుకుచు నున్నవారు, మరి
  బల్కుచు నుందురు శాశ్వతంబుగన్.

రాయలకీర్తి వెల్గులెల
ప్రాయపుచిందులు ద్రొక్క, నిస్పృహా
ధ్యాయ కవీశ్వర కృతుల
తావుల జిమ్మగ నాంధ్ర రాష్ట్రిపూర్ణ
పాయస మందుకొంచు పర
పంచల జిక్కక వ్రాసినట్టి శో
భాయుత కావ్య గీతికల
పావనతన్ యొనగూర్పు భారతీ!

ఏడువకమ్మ! 'ఆంధ్ర వసు
ధేశుడు బోయెను. ఏది దిక్కు? నా
నీడకు వచ్చువారెవరు?...
నీడయటన్నది నే నొసంగుదే?
వాడిన దాంధ్ర వృక్ష'మని
వందురకమ్మ! నవీన కావ్యముల్
పాడుదు రాంధ్ర పుత్రుల వి
పాత యశమ్మును పెంపుసేయగన్.

అందుగుల లక్ష్మీరావు.

# చిట్టి చంద్రుడా!

పారదోలావోయి
నాచిట్టి చంద్రుడా!
పారదోలీ నీవు
హాయిగొల్పావు.

మబ్బుల్లో కూడేటి
మాయలూ జేసేటి
మాయ మంత్రాలతో
మరుగు దొంగలగూర్చు
కారు చీకటులను ॥పార॥

ప్రేయసీ ప్రియులకు
ప్రణయ వాహినిలోన
అడ్డు గలిగించేటి
అమవాస్య రాత్రులన్ ॥పార॥

అడుగులూ తడబడుతు
అణువు మాత్రములోన
అన్య త్రోవల బో
బాటసారుల భ్రాంతి ॥పార॥

కారు మబ్బులలోన
కంచెల్లో మేసేటి
కోడె లేగల కొరకు
రైతు భయభ్రాంతులన్ ॥పార॥

'చంద్రుడేడే' యన్న
చంటి పిల్లలపోరు
తప్పించ మెప్పించ
తల్లిపడు తహతహను ॥పార॥

పారేటి నదులలో
ప్రజ్వరిల్లే కాంతి
కప్పి పుచ్చగజూచు
కటికి చీకటిని ॥పార॥

'కథలెన్ని చెప్పినా
చెవుల కింపేగాని
కంటి కింపేదన్న'
కన్న కొడుకూపోరు ॥పార॥

'ఎటుజూచినాగాని
ఏమిలేదూ' అంచు
ఏకాంత కవిభ్రాంతు
లెగిరిపోవ్వూనట్లు ॥పార॥

లేత చిగురాకులకు
లేని వన్నెలనిచ్చి
కవుల లేపీ నీవు
కలము సందించి
కైత లేని కొరత ॥పార॥

అందుగుల తిరుమలరావు.

# గాంధీమహాత్ముడు

భారతప్రజానీక హృత్ఫలకభాగ
చిత్రితాదర్శమూర్తి! పూజితవిచిత్ర
నిర్మకుటచక్రవర్తి! సన్నియమవర్తి!
భావి భారతదేశ సౌభాగ్యకర్త!
వర్ణభేదకారక పరిపంథి! గాంధి! ౧

సరళపథగామి! ప్రాచ్యపాశ్చాత్యశాస్త్ర
గతరహస్యార్థ వ్యాఖ్యానకర్త! జాతి
దుర్దశాధ్వాంత నిర్ఘాత తుహినకరుఁడు!
ఆత్మనిగ్రహపరుఁడు, సత్యవ్రతుండు. ౨

దాస్యశృంఖలాబద్ధయై, లాస్యదివ్య
నైజ తేజోవిభూతినంతయును బాసి
దీనదృక్కులఁబఱచు మాతృ చరణాబ్జసేవ
లందహర్నిశము వసించుచుండు. ౩

గర్భనిర్భేదకస్థితిఁ గనులనురలు
ఉష్ణబాష్పములనుఁజిమ్మి, యోర్పుమీఱ
బీదవారలనోదార్చి యాదరించి
సిలుగులను బాపి సంతృప్తిఁగలుగఁజేయు. ౪

కూడుఁగుడ్డకునోచని కోట్లకొలఁది
భారతీయులదుఃఖంబుఁ బాపనెంచి
స్వీయ సౌఖ్యములనువీడి వివిధగతులఁ
బాటుఁబడుచున్న ఘనదీన బాంధవుండు! ౫

సద్గృహస్థుఁడయినఁగాని జఱుపుచుండెఁ
గఠిన బ్రహ్మచర్యాశ్రమక్రమవిధులను
దుర్బలశరీరుఁడయ్యును దొలఁగకుండ
శత్రుజాలమునోడించు శక్తియుతుడు.

పాంచభౌతిక దేహ సంబంధవిధుల
నాచరించుచుఁ బ్రాపంచికాత్మసుఖ వి
వర్జితాముష్మికానంద పారవశ్య
మున మెలంగునిష్కామయోగ నిరతుండు.

బ్రహ్మతేజంబును లలాటభాగమందుఁ
జిన్మయానందగరిమ హృత్సీమయందు
శాంతరసమునునిడుద దృగంతమందు
సంతరించుకొన్నట్టి విశ్వంభరుండు.

మూడుగజములచేనేత ముతకగుడ్డ
మొలకుఁగట్టుకొన్న 'ఫకీరు' మోమునందు
రాజకీయవేత్తలనుఁ బరాజితులనొనర్చు
దివ్యతేజస్సు కన్పడుచునుండు.

పద్మబాంధవుఁడస్తమింపని విశాల
రాజ్యమునకాధిపత్యము ప్రాప్తమైన
జార్జి సార్వభౌముని కరస్పర్శనలకుఁ
జేతినందిచ్చిన వినమ్రశేఖరుండు.

మోహనాకారుఁడునుగాడు-ముసలివగ్గు;
నాగరికుఁడునుకాడు - సనాతనుండు;
విస్తృతావనీశుఁడుకాఁడు-పేదరైతు;
కాని ముఖ్యాతిముఖ్యులలోనమిన్న. ౧౧

ప్రథిత మౌనవ్రతావలంబనమునఁ గడు
క్లిష్టరాజ్యాంగ సూత్రవ్యాకృతినొనర్చు;
సత్య నియమపాలనమునఁ జక్కఁజేయు
వైరిహృదయ దౌర్జన్య నివారణంబు. ౧౨

పూత హిందూమతవిరుద్ధ భూరిదోష
సహితస్పృశ్యభేదవివాద సరణినెల్లఁ
గఠినహృదయములుకఱిగి కదలునట్లు
నిరశనవ్రతారూఢుఁడై నిలుపఁగలిగె. ౧౩

భారతీయ విజ్ఞానసంపదను భద్ర
పఱుప, విద్యాప్రణాళిక 'వార్ధ' యందు
సహృదయ వివిధభాషావిశారదుల స
మక్షమందుబోధించి సమ్మతిగడించె. ౧౪

స్వర్ణవాహినీ త్వరితప్రవాహమునకు
ఆనకట్టగట్టఁదలంచి పూనినాఁడు
ఖద్దరోద్యమవ్యాప్తికి-గట్టువడెను
స్వార్థపరులదుశ్చేష్టలా సమయమందు. ౧౫

హృదయభాండమునుండి యమృతమో? విష్ణు
పాదపద్మ సేవాసక్త భక్తిరసమొ?
ధనికభిక్షుక సుఖదుఃఖ తారతమ్య
జనితవిస్మయోద్రేక బాష్పములొ? కాని
కురియుచుండ నారతము-వా క్రువ్వఁగలమొ?

వృషభకేతనుండేమొ? జితేంద్రియుండు;
శ్రీశుఁడో యేమొ? గీతోపదేశకుండు;
హరిహరావతారంబొ? కరాబ్జములను
రాట్నముతకిలీలుండు నిరంతరంబు.

కలముఁబట్టినవాణి ప్రక్కఁగ నెనిలుచు,
నున్నచోటనెలక్ష్మి ప్రసన్నయగునుఁ
బరులనోడింపఁ బార్వతిభయముఁబాపు-
మూడుమూర్తులయవతార మూర్తియేమొ.

అటులఁగాకున్న 'గాంధీమహాత్ముఁ' డెటుల
లక్షలాది గ్రామములుగలట్టి భరత
దేశమున నొకమూల నొదిగిచరించు
స్వల్పమానవుండయ్యుఁ బ్రపంచ నాయ
కాగ్రణులలోన ముఖ్యుఁడై యలరఁగలఁడు?

పుంచల్ల సుదర్శనాచారి